*The Holy Quran –*
*Not a creation of MUHAMMAD (SAS)*
*(Telugu)*

# దివ్య ఖుర్ఆన్ ముహమ్మద్ (స.అ.సం) రచన కాదు

రచన

ఎస్.ఎమ్.మలిక్

అనంత కరుణామయుడు అపారకృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# దివ్య ఖుర్ఆన్ ముహమ్మద్ (సఅసం) రచన కాదు

## మాయని గాయాలు

దైవప్రవక్తగా నియామకం అయిన పదవ సంవత్సరం మహాప్రవక్త (సఅసం) పావనజీవితంలో అత్యంత కష్టభూయిష్టమయిన కాలం. తెల్లవారితే ప్రొద్దు గుంకటమూ, చీకటి ఆవరిస్తే తిరిగి వెలుగు చూడటమూ ఎంతో దుర్భరంగా ఉండేది.

ఖురైష్ తెగలన్నీ ఏకమై ముస్లిములనూ బనీహాషిమ్ తెగవారినీ సంఘబహిష్కరణ చేశారు. గత మూడు వర్షాలుగా తన కుటుంబం, సహాబా (సహచరులు) సమేతంగా "షిఅబే అబీ తాలిబ్"లో బందీలుగా ఉంటున్నారు మహాప్రవక్త (సఅసం). అది మక్కా నగరంలో ఒక వీధి. ఈ వీధికి అన్ని వైపులా బలిష్ఠమైన కాపలా నియమించారు ఖురైష్ ప్రజలు. ఏ విధమయిన ఆహార ధాన్యాలు, తినుబండారాలు లోనికి చేరడానికి తావు లేకుండా

కట్టుదిట్టం చేశారు. మూడు సంవత్సరాల ఎడతెగని ఈ బహిష్కరణ వల్ల ముస్లిముల వెన్ను విరిగినంత పనయింది. ఆకులలములు, చివరికి ఎండిపోయిన చర్మం తిని జీవించవలసిన కష్టతర ఘడియలు ఎన్నో ఎదురయ్యాయి. విశ్వాసుల సహన గుణానికి పరీక్షా సమయాలు అగణ్యంగా ఆసన్నమయ్యాయి.

దైవమా అంటూ ఆ సంవత్సరమే బహిష్కరణ బంధాలు తెగాయంటే- గత పదేళ్ళుగా తనకు అండగా నీడగా నిలుస్తూ, సంక్లిష్ట కాలంలో ఆదుకుంటూ వచ్చిన మహాప్రవక్త (సఅసం) పినతండ్రి అబూతాలిబ్‌గారు హఠాత్తుగా మరణించారు. ఈ విపత్తు నుండి ఇంకా తేరుకోనక మునుపే మరొక్క గాయం సహనమూర్తులయిన మహాప్రవక్త(సఅసం) హృదయాన్ని పీడావృతం చేసింది. ఇస్లామ్ ఉద్యమంలో తొలినుంచి కూడా మహాప్రవక్త (సఅసం)కు ఓదార్పు, తృప్తి, మానసిక శాంతిని చేకూర్చుతూ, సుఖ దుఃఖాలలో తోడు నీడగా నిలిచిన ఆయన జీవన సహధర్మచారిణి హజ్రత్ ఖదీజా (రజిఅన్) దైవసన్నిధికి చేరారు.

ఈ దెబ్బను కూడా నిగ్రహించుకున్నారు మహాప్రవక్త! బాధాపరంపర కారణంగా నబువ్వత్ పదవ వర్షాన్ని "ఆముల్ హుజ్న్" (కష్టాలూ, బాధల సంవత్సరం) అని పేర్కొనేవారు.

హజ్రత్ ఖదీజా(రజిఅన్), హజ్రత్ అబూతాలిబ్‌ల నిష్క్రమణానంతరం మహాప్రవక్త (సఅసం)తో విరోధంకై మరింతగా సాహసం చేయగలిగారు మక్కా అవిశ్వాసులు. చివరికి ఆయన తన ఇంటి నుంచి బయటికి అడుగు పెట్టడమే దుస్సాధ్యమయిపోయింది. మిథ్యావాదులు, హేతువుకు, వివేకానికి, విజ్ఞాన మార్గానికి స్వస్తి చెప్పి, దైవసందేశం సూచించే సత్య బోధనలనూ,

సన్మార్గాన్నీ, వాటి హేతు బలాన్నీ, ఎదుర్కొనలేక బిత్తరపోయి సందేశహరుణ్ణి ఆయన అనుచరుల్ని శారీరకంగా హింసించడం మొదలెట్టారన్నమాట.

## భగ్న హృదయం

గత పది సంవత్సరాలుగా దైవ సందేశం అందజేస్తూ పరిస్థితులు ఈ దశకు రాగా చివరికి, "బనీ సఖీఫ్" తెగవారికి ఇస్లామ్ ఆత్మవికాసక సందేశాన్ని పరిచయం జేసే సంకల్పంతో 'తాయిఫ్' నగరానికి ప్రయాణమయ్యారు మహాప్రవక్త (సఅసం). ఆయన వద్ద అప్పుడు ఏ వాహనమూ లేదు. మక్కా నుంచి 'తాయిఫ్' వరకు ఒంటరిగా, కాలి నడకన ప్రయాణించారు. వారక్కడ కొన్ని దినాలుండి, 'బనీ సఖీఫ్' తెగ నాయకులను ఒక్కొక్కరినే సందర్శిస్తూ వారితో తన సందేశం గురించి సంప్రతించారు, వారు ఆయన మాట అంగీకరించకపోవటమే కాక, తమ నగరం విడిచి వెంటనే వెళ్ళవలసిందిగా పురమాయించారు. తాయిఫ్ విడిచి పెట్టడం తప్ప వేరే గత్యంతరం లేక పోయింది.

## చేసినది చాలక...

నిస్పృహచ్ఛాయలు ఆవరించగా బాధాపీడిత హృదయంతో అతి భారంగా తాయిఫ్ నగర వీధులను ఆశగా చూస్తూ మక్కా నగరానికి తిరోన్ముఖులయ్యారు మహాప్రవక్త (సఅసం). అంతటితో మిథ్యా ప్రేమికుల కళ్ళు చల్లబడలేదు, ఆయన అక్కణ్ణుంచి బయలుదేరేటప్పుడు తమ నగరంలోని గూండాలను, రౌడీలను మహాప్రవక్త (సఅసం)ను వెంబడించడానికి

నియమించారు, ఈ రౌడీలు దూషణలు విసరడం, దుర్భాషలాడటంతో విరమించక ఆయనపై రాళ్ళు రువ్వుతూ వెంబడించారు. దేహమంతా గాయాలై దుస్తులన్నీ రక్తసిక్తములయ్యాయి. దేవుని చివరి ప్రవక్త, జగన్నాయకుడు, దివ్యదైవవాణి తెచ్చిన దైవసందేశహరునిపట్ల ఇదీ ప్రపంచం చూపిన ఆదరణ! కాళ్ళ నుంచి కారిన రక్తం పాదరక్షల్లో నిండిపోయింది. ఈ అవస్థలో ఆయన తాయిఫ్ వెలుపల ఒక ఖర్జూరపు తోట ప్రహరిగోడ నీడన అలసిపోయి కూర్చున్నారు. తన బాధాపూరిత గాధను ఆలకించేవారెవరు? ఆపద్బాంధవుడు, దీన జన రక్షకుడు, మొరలాలకించేవాడు దేవుడు ఒక్కడే! ఆయనకే, తన ప్రభువుకే, తన నివేదన సమర్పించుకున్నారు మహాప్రవక్త (సఅసం).

## దీనావేదన

"దేవా! నాలోని శక్తిహీనతను, అసహాయస్థితిని, నిరుపాయతను జనుల దృష్టిలో నిరాదరణను నీతోనే నివేదించుకుంటున్నాను ప్రభూ!

"కరుణాకరా! కృపాసాగరా! శక్తిహీనుల ప్రభువు నీవే. నాకూ ప్రభువు నీవే; నన్ను ఎవరి పాలు జేస్తున్నావు దేవా! నాతో కఠినంగా ప్రవర్తించే వారికో లేక నన్ను లోబర్చుకోగలిగే శత్రువుకో నన్ను అప్పగిస్తున్నావా? నా ఎడల నీ అసమ్మతి లేకపోతే నాకు అదే పదివేలు. మరే చింత నన్ను బాధించలేదు.

"నీ శరణులోనే నా తృప్తి. అంధకారంలో ప్రకాశాన్నిచ్చే, ఇహపరాల సాఫల్యం ప్రసాదించే నీ దివ్య తేజస్సు యొక్క శరణువేడుకుంటున్నాను ప్రభూ! నీ ఆగ్రహం నాపై కలుగకున్నట్లు, నేను నీ శిక్షకు పాత్రుణ్ణి కానట్లు

నన్ను రక్షించు! నీ ప్రసన్నతి లభించే వరకు నీ ఇచ్ఛనే శిరసావహిస్తాను ప్రభూ! నీవే సర్వకార్య సమర్థుడవు, నీవు తప్ప వేరేశక్తి లేనే లేదు."

బాధావృత భగ్న హృదయంతో, దేవుని సందేశం పట్ల జనులు చూపిస్తున్న నిరాదరణను తలపోస్తూ, బాధపడుతూ మక్కావైపు నడక ప్రారంభించారు మహాప్రవక్త (సఅసం). "ఖర్నుల్ మనాజిల్" అనే చోటికి చేరేటప్పటికి గగనాన్ని మేఘాలలముకున్నట్లయింది. కన్నెత్తి చూస్తే జిబ్రయీల్ (అలైహిస్సలామ్), ఒక దైవదూత కనపడ్డారు.

"ఈ పురవాసులు మి ఎడల ప్రవర్తించిన తీరు, మీ సందేశానికి వారిచ్చిన సమాధానం అల్లాహ్ అంతా గమనిస్తూనే ఉన్నాడు. ఆయన పర్వతశ్రేణుల నిర్వాహక దూతను పంపాడు. మీ ఇచ్ఛప్రకారం ఇతనికి ఆజ్ఞాపించండి" అన్నారు జిబ్రయీల్.

పర్వత నిర్వాహక దూత సలాము చేసి "మీరు ఆజ్ఞాపిస్తే తాయిఫ్‌కు ఇరువైపులనున్న ఈ పర్వతాలను, మీ సందేశాన్ని నిరాకరించి, మిమ్మల్ని బాధపెట్టిన వారిపై పడవేస్తాను" అని అన్నాడు.

"వద్దు! వీరిని సంహరించవద్దు. సాటిలేని ఏకైక దేవుని ఆరాధించేవారిని వీరి సంతతిలో అల్లాహ్ సృజిస్తాడని నాకు విశ్వాసముంది" అన్నారు కారుణ్యమూర్తి.

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు మానవ జాతిపై ఎంత ప్రేమ! తనను ఎనలేని కష్టాలపాలుచేసి, తన సందేశాన్ని నిరాకరించి తనకు మనోవ్యథ కలిగించటమే కాక శారీరకంగానూ బాధపెట్టిన ప్రజలపై ఎంత కరుణ, ఎంత సానుభూతి!

తదనంతరం ఆయన కొంత కాలం 'నఖల' అనే చోట మకాం చేశారు. సత్సందేశానికి కలిగిన పరాభవంతో ఏ విధంగా తిరిగి మక్కా వెళ్ళడమో అంటూ ఆవేదనపడ్డారు. "తాయిఫ్‌లో ఎదురయిన - పరిస్థితుల వార్తలు మక్కాకు చేరివుంటాయి. అవిశ్వాసులు ఈ దురవకాశాన్ని పురస్కరించుకొని సత్సందేశాన్ని మరింత అవహేళనపాలు చేస్తారేమో, వారికి ఇంకా సాహసం కల్గుతుందేమో" అనుక్షణం ఇలాంటి ఆలోచనలతోనే కుమిలిపోయారు మహాప్రవక్త (సఅసం).

## ఆశాకిరణం

అలాంటి దుఃఖపూరితమయిన ఘడియల్లో ఆనాటి రేయి మహాప్రవక్త (సఅసం) నమాజ్‌లో పవిత్ర ఖుర్‌ఆన్ పఠిస్తూ ఉండగా జిన్నుల సమూహమొకటి ఆ దారిన పోవడం తటస్థించింది. వారు మహాప్రవక్త (సఅసం) పఠించే ఖుర్‌ఆన్ విన్నారు. తక్షణమే సత్సందేశం వారి హృదయాంతరాళాల్లో స్థానమేర్పరచుకున్నది. వారు ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించారు. అంతేకాదు, తమ జాతి వారిలో కెళ్ళి ఇస్లామ్ ప్రచారం చేయటం మొదలెట్టారు.

ఈ శుభవార్తను ప్రస్తావించి తన ప్రవకను ఓదార్చుతూ దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ ఇలా సెలవిచ్చాడుః

"తోటి మానవులు మీ సత్సందేశాన్ని తిరస్కరించినప్పటికీ, ఎందరో జిన్నులు దాన్ని ప్రాణప్రదంగా ప్రేమిస్తున్నారు. వారు దాన్ని తమ జాతివారిలో ప్రచారం చేస్తున్నారు." (46:29,30 ఆధారంగా)

అది ఎంతటి నిస్పృహాజనకమైన వాతావరణమో, తన ప్రవక్తను

ఓదార్చడానికి దైవం స్వయంగా తన దివ్యవాణిలో ఆ సంఘటనను పేర్కొనవలసి వచ్చింది.

ఇది మక్కా జీవితపు కష్టతర కాలంలోని ఒక సంవత్సరంలో జరిగిన ఒక సంఘటన, అందులో మహాప్రవక్త (సఅసం) ఆత్మకు, మనస్సుకు, శరీరానికి ఎనలేని బాధలు. ఎంతటి నిబ్బరంగల మనిషి అయినా ఈ పరిస్థితుల ప్రభావానికి లోనవకపోడు. ఎంతటి అచంచల మనస్సయినా చలించక మానదు.

ఇలాంటి నికృష్ట పరిస్థితుల్లో ప్రతిక్రియకై మనిషి పెడద్రోవ అవలంబించకపోయినా కష్టాల ఫలితంగా ఏర్పడిన మానసిక స్థితికి అనురూపంగా అతని భావోద్రేకాలు పరివర్తన చెందడం సహజం. అయితే భావోద్రేకాల ప్రభావం సంభాషణపై, ఆలోచనా తీరుపై, చేష్టలపై పడుతుంది. ఆంతర్యం సద్గుణ సంపన్నమవడం చేత శత్రువులపట్ల నోటి నుండి దుర్భాషలు, దూషణలు వెలువడకపోయినా కనీసం పరిస్థితులపై నింద, తన బాధల గురించి ప్రస్తావన నోటికి రాక మానవు.

## ముహమ్మద్ రచనే అయితే...

తాయిఫ్‌కు వెలుపల ఖర్జూరపు తోట వద్ద చేసిన, పైన పేర్కొన్న, ప్రార్థనను పరిశీలించండి. ఆ ప్రార్థనలోని ప్రతిపదం ఆయన అనుభవిస్తున్న మానసిక వ్యధను వ్యక్తపరుస్తుంది. అందులో ఎంతో ఉదాత్తతతో సహనశీలుడైన ఒక వ్యక్తి తన మనోవేదన దైవసన్నిధిలో విన్నవించుకునే తీరు గోచరిస్తుంది.

కాని అదే మక్కా జీవితపు కష్టతరమయిన కాలంలో ముహమ్మద్ (సఅసం) వినిపించిన పవిత్ర ఖుర్ఆన్ భాగాలను జాగ్రత్తగా అధ్యయనం చేయండి. ఉదాహరణకు అహ్కాఫ్ సూరానే పఠించండి. ఇందులోనే జిన్నుల ఇస్లామ్ స్వీకృతిని గురించి ప్రస్తావించబడింది. పైన పేర్కొన్న విషమ పరిస్థితులకు లోనయిన వ్యక్తిలో సహజంగా జనించే మానవ భావోద్రేకాల ప్రభావం ఇసుమంతయినా ఈ సూరా సాంతం గోచరించదు... ఎందుకూ?

మహాప్రవక్త ముహమ్మద్(సఅసం) దివ్య ఖుర్ఆన్ రచించినట్లయితే ఈ సూరా మొత్తంలో ఏ ఒక్కచోటయినా ఆయన అంతర్యాన్ని ఆవరించి ఉన్న భావోద్రేకాల ఛాయ, మనోవ్యాకులతకు చిహ్నంగా గోచరించకపోయేది కాదు. కాని- కానరాదే! ఈ ఒక్క సూరాయే కాదు, ఆ కాలంలో అవతరించిన మరే సూరానైనా శ్రద్ధగా పఠించండి, ఏ ఒక్కచోటైనా అప్పటి పరిస్థితుల ప్రభావం ద్యోతకమవుతుందేమో చూడండి!

పైన పేర్కొన్న ఒక సంఘటనే కాదు, మహాప్రవక్త 23 ఏండ్ల నబువ్వత్(దైవ దౌత్యం) కాలంలో ఎదురయిన వివిధ పరిస్థితులు దివ్య ఖుర్ఆన్‌లో ప్రస్తావించబడినా, సాధారణంగా ఒక మానవునిలో పరిస్థితుల పర్యవసానంగా కలిగే మనోపరివర్తనలూ, మారే రాగద్వేషాలు, జనించే భావోద్రేకాలూ అందులో ఏ కోశానా కానరావు.

ఇది ఇలా ఉండగా ఆయన 23 ఏండ్ల దైవదౌత్య జీవితంలోని ఒక్కొక్క సంఘటన, ఒక్కొక్క కదలిక, ఒక్కొక్క వాక్కు, ఆదేశాలు, బోధనలు ఆయన (సహాబా) అనుచరులు భద్రపరిచారు. ఈ ఆదేశాలే, ప్రవచనాలే హదీసులనబడుతున్నాయి. వేలాదిగా ఉన్న హదీసులను

పరిశీలించండి. ఈ మధుర వచనాలు ఒక విశిష్టమైన ప్రత్యేకత కలిగి, భావగర్భితంగా, ప్రతిమాట ఒక భావనా సరోవరంగా వున్నప్పటికీ దైవవాణికి ఏ విధంగానూ పోలి లేవు. ఖుర్ఆన్ ధారావాహికమైన భావ ప్రకటన. భావయుక్తమైన శైలి. అత్యున్నతమైన అనుపమ సాహితీ స్థాయి, అంతా ఒక ప్రత్యేకత. దీనితో ఏ మానవ రచన కూడా చివరికి దాని సందేశహరుని స్వీయ వచనాలయినా సరితూగలేవు.

ఈ పంథాలో పవిత్ర ఖుర్ఆన్ పఠించే వ్యక్తికి తప్పక సంతృప్తి ప్రాప్తమవుతుంది. నిస్సందేహంగా దివ్య ఖుర్ఆన్ భావోద్రేకాలకు అతీతమైన శక్తి, సర్వావస్థల్లో సన్మార్గాన్ని సూచించే నిష్పాక్షికమయిన శక్తి. దైవం అనుగ్రహించిన సందేశమే కాని-దాన్ని అందించిన సత్యసంధుడు, విశ్వసనీయుడైన అల్లాహ్ అంతిమ దైవ సందేశహరుడు మహాప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) రచన కాదు.

– ః సమాప్తం ః–

ఇస్లామ్ మత మహాప్రవక్త ముహమ్మద్ జీవిత విశేషాలు, సందేశం, ఈ గ్రంథంలో పొందుపరచారు. ఇస్లామీయ ఉద్యమ స్వరూప స్వభావాలు, దాని వైలక్షణ్యం ఈ గ్రంథం వివరిస్తుంది.

అనువాదం సులభగ్రాహ్యమైన వ్యావహారిక శైలిలో సాగింది. తాత్త్విక విషయాలను కూడా విడమరచి చక్కగా అర్థమయ్యే రీతిలో తెలియజేశారు.

– జి.రా.

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక